ధ్రప్రచారిణీగ్రంథనిలయము.

అనుబంధగ్రంథమాల 27.

# భారతీయులయుపనివేశములు.

ఇది

(కర్ణాటకభాషనుండి)

బాలాంత్రపు నీలాచలముగారిచే

ఆంధ్రీకరింపఁబడినది.

ఆయ్యగారి నారాయణమూర్తి బియే బియల్

గారిచే సంపాదితము.

మొదటికూర్పు.

ఆంధ్రప్రచారిణీముద్రాక్షరశాలలో

ముద్రింపఁబడినది.

నిడదవోలు.

౧౯౧౪.

# పీఠిక.

ఈగ్రంథము కీర్తిశేషులగు బి. వేంకటాచారిగారి కై స్కాందగ్రంథమునుండి బాలాంత్రపు నీలాచలముగారిచే నాంధ్రీకరింపఁబడినది. నీలాచలముగారినిలయమున కీవఱకు దీనితో 9 గ్రంథములను వ్రాసియిచ్చిరి. వీరు అక్టోబరు 2 వ తేదీని కాలధర్మమునొందిరని చెప్పుటకెంతయును జింతిల్లుచున్నారము. మానిలయమునకు వీరొనర్చినమహోపకారము వర్ణనాతీతము. వీరియకాలమరణ మాంధ్రలోకమునకంతకును సంతాపకారణము కాకమానదు. ముందు వీరిజీవితచారిత్రమును సంపూర్ణముగ వ్రాసి మాచందాదారులకీయఁదలఁచినారము. పరమేశ్వరుఁడు వీరియాత్మకు శాశ్వతానంద మొసంగుఁగాక !

ఇట్లు

సంపాదకుఁడు.

శ్రీరామచంద్రః

# భారతీయులయుపనివేశములు.

## (The Foreign Settlements of Ancient Hindus.)

దేశాంతరములకు ప్రయాణమైపోయినయెడల వర్ణధర్మము లడుగంటుననుభీతిచే విదేశగమనము నిషేధింపఁబడినది. ఈసంస్కారము చిరకాలముక్రిందటనే యంకురించియుండుట వలన హిందువులగు మనసంఘమువారు విదేశగమనమునకు విముఖులైయుండిరి. ఆకారణమున మనపూర్వులు బహుకాలమునకుఁ బూర్వమే విదేశములకుఁ బోయి యందందనేకోపనివేశములను (Settlements) స్థాపించియుండిరని చెప్పిన దానినెవ్వరును సహజమని విశ్వసింపలేకున్నారు. మనప్రాచీనులు జలమార్గముగుండ నూతనప్రదేశములకుఁ బోయివచ్చుటకు వలయు సాధనోపకరణములను జాలపూర్వకాలముననె కనుఁగొనియున్నారని చెప్పినచో నది యసంభవమని యందురు. అదియును

గాక మనపూర్వులు మిక్కిలి నపాయకరమగు నాప్రయాణములకుఁ
గావలసిన యధ్యవసాయము, ఉద్యమము, సాహసము మొదలగు
గుణములను గలిగి యుండినట్లు కనఁబడుచున్నను హిందువులు స్వభా
వముగ నట్టి సాహసగుణసంపన్నులనిన మనలోన నేకులు సమ్మతిం
పఁజాలరు. అయినను మేమిపుడు వ్రాయఁదొడఁగిన ప్రకృతచరిత్ర
మూలమునఁ దత్సంబంధములగు ననేకాంశములు వెల్లడిచేయఁ
బడి హృదయఫలకమున హత్తుకొనునని యాశపడుచున్నారము.

సూర్యవంశోద్భవుఁడైన సగరచక్రవర్తి విదేశములందు
సముద్రములపై రాజ్యాధికారమును, ఉపనివేశములను స్థా
పించుటలోఁ బ్రప్రథముఁడని తోఁచుచున్నది. సముద్రమునకు
సాగరమను ప్రతినామము. అందులకుఁ జాల నితిహాసము కల
దు. సగరచక్రవర్తికొడుకు లఱువదివేలును సాగరము త్రవ్విర
నిన, తండ్రియాజ్ఞానుసారముగ సముద్రాభియానమునకు (For
the invasion of the Ocean) బోయిరని యర్థముచేయవలె
నుగాని హాస్యోద్దీపకముగఁ గేవలము శబ్దార్థమును జేయఁదగద
ని ప్రాజ్ఞులు తెలిసికొనవలెను. భరతవర్షపుపూర్వదక్షిణసముద్ర
ములందు వారి విజయము చాల ప్రఖ్యాతి జెందియుండినది. అం
దులకే యాదిక్కులయందున్న సముద్రతీరములందు సగరచ
క్రవర్తి యశ్వమపహృతమైనదని యుపాఖ్యానమునఁ జెప్పట

కు గారణమని తోఁచుచున్నది.

,, తస్యచారయతః సోశ్వః సముద్రే పూర్వదక్షిణే।
వేలాసమీపేపహృతః భూమించైవ ప్రవేశితః॥

శివపురాణము—ధర్మసంహిత అ ౧౨.

సముద్రాధికారులగు ననార్యజనులచే నపహృతమైన యశ్వమును మరలస్వాధీనముచేసికొనుటకై సగరచక్రవర్తి సముద్రీయరాజ్యమును స్థాపించెను. అందులకై భగవానుండగు కపిలమహాముని యాతనికిసముద్రాధిపత్యకుఁడని వరప్రదానముఁజేసెను. ఆతఁడొనరించిన యామహత్కార్యమువలన నాతనిపేరు సాగరశబ్దముతోఁగూడినపిదపనే పురాణమునందుదాహరింపఁబడినది. ఎట్లందురేని—

,,ప్రాదాచ్ఛతస్మై భగవాన్ హరిః పంచనరాన్ స్వయం।
వంశం మేధాంచ కీర్తిశ్చసముద్రంతేన యుంధనం ॥
సాగరత్వంచ లేభేసే కర్మణా తేఁ తస్యవై ॥
తంచాశ్వమేధికం సోశ్వం సముద్రాదుపలబ్ధవాన్''

శివపురాణము—ధర్మసంహిత. అ. ౧౨.

భరతఖండమునకుఁ బూర్వదక్షిణదిక్కులనున్న సముద్రమునందలి సగరచక్రవర్తి యధికారస్థానములన్నియు నిపుడు హిందూద్వీపసముదాయమని(East Indian Archipelago) పేరునడసియున్నవి. ఆద్వీపపుంజమందుఁ బ్రచారములై యతి.

పురాతనములైన నామములయందును కింవదంతులయందును సగరచక్రవర్తి నిజయోపాఖ్యానమిప్పటికిని చెప్పఁబడుచున్నది. ఆద్వీపములందిప్పుడును సగరచక్రవర్తి సముద్రదేవుడుగఁ బూజింపఁబడుచుండెను. (Hindu Superiority, p. 193.) ఇందువలన సూర్యవంశపుక్షత్రియులె ప్రప్రథమమున దేశాంతరములయం దుపనివేశముల స్థాపించినవారనియు, మొదట హిందూద్వీపపురాజము వారివలన నాక్రమింపఁబడినదనియుఁ దెలియవచ్చుచున్నది. ఆద్వీపవాసుల పౌరాణికేతిహాసములును వారి పౌరాణేతిహాసములు నందలిగొప్పగొప్పకట్టడములయందు చెక్కఁబడియుండుటయేగాక లిపిమూలకముగ సంరక్షింపఁబడియున్నవి. (Tod's Rajasthan, Vol II p. 218, foot note.)

భరతఖండమునకుఁ బూర్వదక్షిణసముద్రోపకూలమునందు సగరచక్రవర్తియశ్వ మపహరింప బడిన ప్రథమోపనివేశముల చిహ్నములు కానవచ్చుచున్నవి. శ్యామ (siam) దేశమునకుఁ బూర్వపురాజధానియగు "సఖోటై" యను సగర నామోత్పన్న ప్రతినామంబగు సాకేత మనుదానికి రూపాంతరమైయుండవచ్చును. పిమ్మట నారాజధాని స్థలాంతరమునకు మార్పఁబడినపుడు దానికి యోధ్యానామానుసారముగ "అయుధియా" యను పేరుపెట్టబడినది. వీనినన్నిటిని బర్యాలోచనముఁ జేసి చూచినచో సగరచక్రవర్తి సంప్రసవసంబంధ

ములు చక్కగ వ్యక్తములగును. ఐరోపాఖండనివాసులు పోయి అ
మెరికా, ఆస్ట్రేలియా మున్నగు దేశాంతరములయం దుపనివేశ
ములను స్థాపించుకొని వానికిఁ దమ జన్మభూమినగరముల పేరులగు
వానినామములఁ బెట్టినట్లు దృష్టాంతము లనేకములు కనఁబడుచు
న్నవి. అట్లే, అయోధ్యనామానుసారముగ నానూతనరాజధా
నికి 'అయూధియా' నామము పెట్టబడెను. ఆనూతననగర మొ
కానొక కాలమున శిల్పచాతుర్యముగల యనేకహర్మ్యముల
తోడను ప్రసిద్ధములగు కట్టడములతోడను సంశోభితమై యు
లరారెను. దానిశోభాసమృద్ధిం జూచి యాశ్చర్యమునొందిన
బుడుతకీసు(Portugisu)వారును, ఒలందా(Dutch) వారును నా
నగరమునకు ప్రాచ్యవినీసు (Venice of the East) అను పే
రును పెట్టిరి. ఆనగరమిపుడు శిథిలమైపోయినను నదలియున్న శేష
ములఁ గొన్నిటిని జూచినయెడల నానామమునకది తగియున్నట్లే
దోఁచును. ఇప్పటిపర్యాటకులు (Travellers) దానిఁ గనినవారు
వర్ణించినవర్ణనమును జూచినపుడుగూడ సమృద్ధంబగు నాగరము
వలెఁ బ్రాకృతవిచిత్రమైనది నటియొక ప్రదేశము లేదని బోధ
యగుచున్నది. జేమ్సుఫర్గూసను (James Furguson) చే వ్రా
యబడిన స్వదేశీయస్థాపత్యేతిహాసమును (History of Ar-
chitecture in all Countries) ను ప్రసిద్ధగ్రంథమునం దీవిష
యమును గూర్చి చెప్పినదాని నిందు నుదాహరించెదము.

Up to the fourteenth century, the capital of the country (Siam) was Sokotay—a city in the Menam, 200 miles from the sea * * * Having accomplished this, they moved their capital down to Ayuthia—little more than 50 miles from the sea.

As Ayuthia was, for three countries, the florishing capital of one of the great building races of the world we should look for considerable magnificence having been displayed in its architecture. From the accounts of the early Portuguese and the Dutch, who visited it in the days of its glory, it seems to have merited the title they bestowed on it of the 'Wenice of the East,' and the remains justify their eulogium. As described by recent visitors, nothing can be more wildly picturesque than this once splendid city.

భారతీయులు శ్యామదేశమునందు స్థిరపడినపిమ్మట 'క్యాంబోడియా' (Cambodia) లో నుపనివేశములేర్పరుచుకొనినటులతోఁచెడిని. 'అయూధియా' యనునది 'అయోధ్య' నామమును స్ఫురింపఁజేయునట్లె, 'క్యాంబోడియా' యను నదియందుఁ జేరినవారిభరతఖండపుటాదినివాసస్థానముగు 'కాంభోజ' దేశపుపేరును సూచించుచున్నది. తక్షశిలానగరమునకు నలుదిక్కులనుండు దేశమునకు కాంభోజదేశమని పేరు. ఆదేశీయులు పోయి నూతనముగ సంపాదించుకొనిన ప్రదేశమునకు

స్వదేశపునామమును బెట్టుటయేగాక యానూతనదేశ రాజధా
నికి స్వదేశరాజధానియగు "ఇంద్రప్రస్థపురి" యను నా
మానుసారముగ 'ఇందుపథపురి' యను నామమును బెట్టిరి.
అది "ఇంద్రప్రస్థపురి" యను దానియపభ్రంశరూపము
ని వ్యక్తమగుచున్నది. శ్యామదేశము సూర్యవంశక్షత్రియు
లచే నాక్రమింపఁబడినట్లు క్యాంబోడియా దేశము చంద్ర
వంశీయులచే నాక్రమింపబడినట్లు తోఁచుచున్నది. ఎందు
వలననఁగా—భారతవర్షమునందు 'అయోధ్య' సూర్య
వంశపువారికి ప్రధానరాజధానియై యున్నది. 'ఇంద్రప్రస్థపు
రము' చంద్రవంశపువారికి ప్రధానరాజధానియై యున్నది.
కాలక్రమమున క్యాంబోడియా దేశము శ్యామదేశస్థులచే నా
క్రమింపఁబడి యాదేశముతోఁ జేరిపోయెను. చంద్రవంశీయులు
కట్టించినకట్టడములయందు కాశ్మీరదేశపుశిల్పనైపుణ్యము ప్రక
టితమగుచుండెను. ఆకట్టడము లాయతనమునందును కుశల
శిల్పకార్యములందును భూమండలముపైనున్న యితరోత్కృ
ష్టభవనాదికములకుఁ గొఱతవడునవి కావని చెప్పవలసియుండెను.
(Indian Sculpture and Painting, by E. B. Havell.
& History of Architecture in all Countries Vol. II.)

సముద్రమునకు 'సాగర' మనుపేరు సూర్యవంశో
పనివేశికులచేఁ బెట్టఁబడినట్లు 'సింధు' వనుపేరు చంద్రవంశో

పనివేశికులచే వాడఁబడినట్లుతోఁచుచున్నది. చంద్రవంశపువారు మొదట సమస్తదేశమునందు సింధునదముండుటయు, నది సముద్రముతోఁబోలుచుండుటయుఁ జూచి సముద్రము సింధునదీ ప్రసర్థమానాంశమని యూహించిగాని సముద్రము విశాలమైన మహిమొ? సింధునదమని యూహించి గాని దానికి సింధువని యేల పేరుపెట్టకూడదు ?

శ్యామదేశమునందుఁ గాలక్రమమున మగధుల ప్రభావము ప్రాదుర్భావమునొందినట్టులతోఁచెడిని. అందులకుఁదగినప్రమాణములు దొరకఁగలవు. శ్యామదేశపువారి ధర్మశాస్త్రములు పాలిభాషయందు వ్రాయఁబడినవి. అచ్చట నాభాషకు 'పాశామకత' యనిపేరు. 'పాశామకత' యను పేరుఁ భాషామగధ' యను దానియపభ్రంశరూపముగనుండనోపు. మగధుల పాలిభాషయందె శ్యామదేశీయుల ధర్మశాస్త్రములు వ్రాయఁబడినకారణమున మగధుల బౌద్ధధర్మప్రభావము శ్యామదేశస్థులయందుఁ గూడ విస్తరించియుండెనని వ్యక్తపడుచున్నది. అందులకచ్చటి యితిహాసము కూడఁ బ్రమాణముగనున్నది (Cyclopædia of India by Balfour.) హిందువులు శ్యామదేశమునకువచ్చి స్థిరపడినపిమ్మట వారక్కడనుండి యవ (జావా) ద్వీపమునకుఁబోయియుపనివేశముల నేర్పరుచుకొనియుండిరని బోధపడుచున్నది. పై నిచెప్పినరీతిగ భారతవర్షమునకుఁ బశ్చిమోత్తరమునందున్న

కాంభోజదేశీయులు క్యాంబోడియాకువచ్చి యవనివాసులైనట్లే
కాంభోజమునకుఁ జెందియున్న ప్రదేశములలోనిజనులు యవ
ద్వీపమునకువచ్చి స్థిరపడఁజొచ్చిరి. హిందువులు గుజరాతినుండి
పోయి మొదట యవద్వీపమున దమరాజ్యాధికారమును జేయఁ
దొడఁగిరి. ఆదిశకుఁడు లేక ఆద్యశకుఁడనునాతఁడు క్రీ శ 75 సం॥ర
మున యవద్వీపమునకు మునుముందువచ్చెను. కాని యచ్చట
మారియును నుపద్రవములుండుటచేతనో మరియే కారణమున
నో గాని యాతఁడు తిరిగిస్వదేశమునకు వెడలిపోయె
నని యవద్వీపప్రాచీనేతిహాసమునందు వాడుకొనఁబడినది.
ఈయంశమును ప్రత్నతత్త్వవిదుఁడగు (Archiologist) హేవి
లుదొరగారంగీకరింపలేదు. అతఁడు చెప్పినదేమందురేని—
యవద్వీపజనులు తమపూర్వపురాజు లుత్తరహిందూస్థానపు
శకరాజవంశములోనివారని చెప్పుకొనుటకై తమచరిత్రము
నందట్లు ఆద్యశకుఁడు తిరిగివెడలిపోయెనని వ్రాసిరని హేవిలు
దొరగారియభిప్రాయము. ప్రకృతపక్షమునం దయిదు శతాబ్ద
ములు గడచినపిమ్మట క్రీ, శ 603 వ వత్సరమున హిందువులు
రెండవసారివచ్చిరను నంశము నిజముగ వర్ణింపఁబడినట్లు తోఁచు
చున్నది. ఏమందురేని— గుజరాతిదేశపురాజొకఁడు తనభా
వికాలపుచరిత్రమునుగూర్చి యోచించుకొనునపుడు తనరాజ్య
ము ధ్వంసమగునని తెలిసికొని తన తనయుని యవద్వీపమున

కుఁ బంపివేయవలయునని నిశ్చయించుకొనెను. తన చెంతనున్న ఆదిశకుఁడు యవద్వీపసంబంధమునుగూర్చి వ్రాసిన చరిత్రము ను తన తనయునకిచ్చి యాతని నైదువేలమంది యనుచరులతోఁ గూడ యవద్వీపమునకుఁ బంపివేసెను. కుమారునితోడ వెడలిపో యిన నైదువేలమంది యనుచరులయందు కృషీవలులు—శి ల్పులు—చికిత్సాశాస్త్రజ్ఞులు—దక్షులగు లేఖకులు—యుద్ధవిద్యాపా రంగతులు నుండియుండిరి.

వారందఱు నాలు పెద్దపడవలలోను, నూరారు చిన్నపడ వలలోను ప్రయాణమైపోయిరి. సముద్రముమీఁద నాలుగు మాసముల ప్రయాణము చేసినపిమ్మట నొక ద్వీపమునకు వారు చేరిరి. కాని యాద్వీప మాదిశకుఁడు వ్రాసినవర్ణనముతోఁ సరి పోలియుండనందున వారందరందుండి బయలుదేరిపోయి మరల కొన్నినెలలు దనుక సాగరయాత్రనడపి యందు వేరొక ద్వీపము ను గనుఁగొని రాజకుమారుఁడు నాతని యనుచరులలోఁ గొంద ఱు నాద్వీపమునకుఁ బశ్చిమప్రాంతతీరమున దిగిరి. ఆద్వీపము దీర్ఘపర్వతపంక్తిచే గూడియున్నది. మిగిలిన యనుచరులాద్వీప మునకు దక్షిణపార్శ్వమున దిగిరి. ఆప్రదేశము యవధాన్య సస్యభూయిష్ఠమైయుండుటయేగాక యాదిశకుఁడు వ్రాసినవర్ణన ముతోఁ గూడ సరిపోలియుండుటవలన వారు తమయుద్దేశమొన గూడెనని యనుకొనిరి. కాని రాజకుమారుఁడు తాను దిగిన

ప్రదేశమున చాలకాలము నిలువలేకపోయెను. అందలి యర
ణ్యమును భేదించి బాగుచేయుటకో నాతని యనుచరులు రో
గపీడితులై యచ్చటనీరుపడక యనేకులు మృతులైరి. ఆకార
ణమున నాతఁడారోగ్యకరముగు వేఱొకతావును వెదకికొనుచు
నాద్వీపమున దక్షిణదిక్కునుండి పూర్వదిక్కునకు వెడలిపోయె
ను. ఆతఁడాద్వీపమధ్యభాగమునకు వచ్చి 'మలెజను' యను
స్థలమునఁ దనయనుచరులను జూచెను. వారాతని నాప్రదేశ
మునకు రాజుగఁ జేసిరి. పిమ్మట కుమారుఁడాకృతకార్యను వార్త
ను తనతండ్రికిఁ దెలుపఁ దండ్రియు సంతసించి కుమారునియొద్దకు
మొదటపంపిన పరివారసంఖ్య బూర్తిచేయుటకై మఱిరెండు
వేల జనులను బంపించెను అప్పటినుండి యవద్వీప మొక రాజ్య
మై ప్రఖ్యాతిఁ జెందెను. గుజరాతిమరియు నితరదేశములతోడ
ను విశేషవ్యాపారము జరుగనారంభమయ్యెను. మలెజనుయు
పసాగరము (Bay of Malajem) అనేకదేశములనుండి రాక
పోకలు సల్పెడివ్యాపారస్థులున్నగు జనులతో నిండిపోయెను.

రాజకుమారుని యధికారకాలమునందును, ఆతనియిరు
వుర ఉత్తరాధికారుల రాజ్యకాలమునందును దేశము యశస్సంపద
యందును సకలవస్తుసమృద్ధియందును విశేషముగనభివృద్ధినొం
దెను. ఆకాలమునందనేకములగు నితరస్థాపత్య(Architectural)
కార్యకౌశలముచేర్పడ జగద్విఖ్యాతమగు 'బోరోబుదర' యను

దేవాలయము నిర్మింపబడెను. దానినిగట్టినవారు భారతీయు లే. క్రీ. శ. అయిదవశతాబ్దమునందు రెండవచంద్రగుప్తుడగు విక్రమాదిత్యునిచే సౌరాష్ట్ర దేశము జయింపబడినతోడనే భరతఖండమున శకాధిపత్యము నిలిచిపోయెను. యవద్వీపము నందుపనివేశస్థాపన కిదియే కారణమని తోచుచున్నది. విక్ర మాదిత్యుని విజయానంతరము బ్రాహ్మణధర్మము తో తధ ర్మముగ బరిణమించుటతోడనే బౌద్ధధర్మమునకు స్థానచ్యుతి కలిగెను. శకదేశోపనివేశకులు బౌద్ధశిల్పసంస్కారమును త మతోగూడ గొనిపోయి 'బోరోబుదర' దేవాలయమును మిగుల రమణీయముగ గట్టిరి.

బౌద్ధశిల్పనైపుణ్యమునకు మహానిదర్శనస్వరూపమైన 'బోరోబుదర' దేవాలయము క్రీ శ 750-800 సంవత్సర ములప్రాంతమున నిర్మింపబడెనని నిర్దిష్టము చేయబడెను. అం దలిమనోహరవిచిత్రపుపనులు సంపూర్తినొందించుట కనేక శతాబ్దములు పట్టియుండవలయును నిజముగ బదియవశతాబ్ద మునందు రాజకీయధర్మముగ బరిణమించి బౌద్ధధర్మస్థాపనము నణగద్రొక్కుటకు బూర్వమీ దేవాలయము సంపూర్తిగ గ ట్టబడియుండదు. (Indian Sculpture and Painting by E. B. Havell.

పైనిజెప్పబడిన యవద్వీపస్థలచరిత్రము ననుసరించి

యందు మొదట నుపనివేశములస్థాపించుకొనినవారు బౌద్ధులే
యనియు, హిందూవిజేతయగు విక్రమాదిత్యునివలన బహిష్కృ
తులై బౌద్ధులున్న దేశమును విడిచిపోయిరనియు హావెలుదొర
వారియభిప్రాయము. కాని యనేకపురాతత్త్వవిదులైన పా
శ్చాత్యపండితుల యభిప్రాయములను యోచించిచూచినచో
యవద్వీపమున హిందువులే మున్ముం దుపనివేశము లేర్పరచు
కొనిరని చెప్పవలసియున్నది. ఫెర్గూసన్ దొరవారు వారి
'సర్వదేశీయ స్థాపత్య శాస్త్రేతిహాసము' ను గ్రంథమునందు హిం
దువులే యవద్వీపమున మొదట యుపనివేశకులైరని యనేక
ప్రమాణవచనములతో జెప్పిరి. ఎట్లయినను యవద్వీపపూర్వ
కాలేతిహాసము మున్నగువానియందు మధ్యభారతవర్షమునం
దలిబౌద్ధరాజుల నామమొక్కటియైనను గానవచ్చుటలేదు. దేశ
దేశములకెల్లధర్మప్రచారకులను (Missionaries) పంపియున్న
యశోకుడుగూడ యవద్వీపపు పేరును జెప్పియుండలేదు. మరియు
యవద్వీపమునందిప్పటివరకు దొరకిన చరిత్రసంబంధములగునుపకర
ణములయందెచ్చటను నీ సంగతి చెప్పబడుటలేదు. మీదుమిక్కిలి మ
హాభారతాది గ్రంథములే యవద్వీపస్థలీయప్రాగితిహాసిక శాసన
కర్తలుగ చెప్పబడియున్నారు. అప్పటి పౌరాణికాఖ్యానముల
కన్నిటికి హిందూశాస్త్రమే మూలమై యున్నదిగాని బౌద్ధశాస్త్ర
ము మూలమై యుండలేదు. అందువలన యవద్వీపప్రథమోపని

వేశకులు హిందువులే యగుదురని చెప్పవలయును. బౌద్ధులని చెప్పఁగూడదు. ఆహిందువులు గుజరాయతీయులనిగాని పశ్చిమభారతీయులనిగాని చెప్పవలసియుండును. భారతవర్షమున హిందువులకుఁ బ్రతిపక్షులైన బౌద్ధులబలవంతముచేఁ దమధర్మానుష్ఠానములకు బాధకలిగినపుడు వారు స్వదేశమునువిడిచి హిందూద్వీపసముదాయమునకు ధర్మానుష్ఠానశాంతిసుఖములకై వెదకికొనుచుఁ బోయియుండవలయునని తోఁచుచున్నది.

చీనాదేశపు పరివ్రాజకుఁడగు ఫాహియాను 413 క్రీస్తుశతాబ్దమున సింహళమునుండి యోడపై ప్రయాణముచేసి యవద్వీపమునకువచ్చెను. అచ్చట మిగుల ప్రాచీనమగు నాకాలమునగూడ. నుభయదేశబ్రాహ్మణరాజులచెంతకు వార్తాహారులగుజనులు వచ్చుచుఁబోవుచుండిరనియు వారందరు హిందువులుకాని బౌద్ధమతావలంబకులుకారనియు ఫాహియాను చెప్పియున్నాఁడు. ఈ ప్రమాణవచనమునందు సందేహముకలుగుటలేదు.
Journal and Proceedings of the Asiatic Society of Bengal, Vol. III, No 7, July 1907.

అనండేలుదొరవారు (Annandale) ఆసియాటిక్‌సొసైటి (Asiatic society) యనుపత్రికయందు 'హిందువులేబౌద్ధులకంటెముందుగ యావద్వీపమునను పనివేశకులైర'ని చెప్పియున్నారు.
Journal and Proceedings of the Asiatic society of Bengal Vol, III No. 7, July 1907.

సంబంధమును గలిగియున్నదని చెప్పుటకు సందేహము లేదు.

"కళింగ" యను నామము పూర్వ మొక కాలమున వంగ దేశమునుగూడ తనలో నిమిడ్చికొనియున్నట్లు పైని చెప్పితిమి. కాలక్రమమున "కళింగ" యను పేరు భారతవర్ష దక్షిణోత్తరకూలములయం దన్నిటియందు వ్యాపించినట్లు తెలియవచ్చుచున్నది. మలయద్వీపములోని బౌద్ధుల యుపకథలయందును ముసలమానులయుపకథలయందును శ్రీ రామచంద్ర హనుమద్దేవుల ప్రాభవమతిశయించియుండెను. దానినిబోధించి చూచినచో నిపుడు మలయద్వీపమునందధి వసించినట్టియు, ప్రవాసగతులైనట్టియు కళింగులలోఁ జాలమంది, పూర్వోక్త దేవభావాపన్నులగు నిరువురవతారపురుషుల స్మరణచేజడితమైన మన్నారుపసాగరమునుండియు (Gulf of Mannar) సేతువునకు నలుప్రక్కలనుండు ప్రదేశములనుండియు వచ్చినవారని చెప్పవలసియున్నది. ఆకారణమున వారి ప్రభావము మలయద్వీపవాసులపై నంత యధికమైయుండెను.
Jurnal and Proceedings of the Asiatic Society of Bengal—Vol III, No 7, July 1907.

మలయద్వీపముపై నడపిన విజయాభియానము దక్షిణ హిందూస్థానమునుండి బయలువెడలినది. అందు సామాన్యముగ యుద్ధముతోఁబనిలేకయె విజయముచేకూరుచువచ్చినట్లు

తోఁచుచున్నది. మద్రాసుతీరముతోను భరతఖండ పశ్చిమతీర
ముతోను మలయులసంబంధము చిరకాలమునుండి కలిగియు
న్నదని చెప్పుటకు సందేహము లేదు. ( Ibid )

"ఇందువలన కళింగులు మదరాసుతీరమునుండి వ్యా
పించిరని తెలిసెను. యవద్వీపమధ్యభాగమునుండి హిందూధ
ర్మము మలయద్వీపమునకు వ్యాపించినట్లు వ్యక్తమగుచున్నది.
ఆహిందూధర్మము యవద్వీపము మొదలగు హిందూద్వీపస
ముదాయమునందంతటను వ్యాపించుటయేగాక అమెరికాదే
శపర్యంతము వ్యాపించియుండెనని ముందుఁ గనఁబడఁగలదు.

పురాతత్వవిదుఁడగు కెప్టన్ కూల్ (Captain Cool)
దొరవారు వారి 'భ్రమణవృత్తాంత' (With the Dutch in
the East) మనుగ్రంథమునందిట్లు వ్రాసిరి హిందువులు క్రీ.
శ. ప్రథమశతాబ్దమున దక్షిణాసియా, చీనాదేశస్థులతో వ్యాపా
రార్థమేపోయి జావా, సుమాత్రద్వీపములందును మలయజాతి
వారివలన నధివసింపఁబడిన యితరద్వీపములందును బ్రవేశించి
స్థిరవసతులనేర్పరుచుకొనఁదొడఁగిరి.

హిందువులు తమ మతధర్మముతోఁగూడఁ గృషివిద్య
ను, పశుపాలనవిద్యను, గొనిపోవుటయేగాక స్థాపత్యశిల్పవి
ద్యలనుగూడఁదీసికొనిపోయి విశేషముగ యవద్వీపమునందు త
మ నాగరికతౌన్నత్యమును గనపరచిరి. దానిచిహ్నములు బో

రోజువరకు మున్నగు కట్టడములయందుఁ బ్రత్యక్షములుగఁ గనఁబ
డును. అవి స్థాపత్యశిల్ప కార్యములకు విచిత్రాదర్శములై
యున్నవి. వారచ్చట ననేక రాజ్యములను స్థాపించిరి. ఆకాలమున
వానిలో మిగులఁ బ్రతాపాన్వితమై సుప్రసిద్ధమువడసిన మదజప
హిత (Madjapahit) యను రాజ్యము వారుస్థాపించినదియే.
ఆరాజ్యము పదునాల్గవశతాబ్దాంత్యభాగమున అంగిక విడ్జపహిత
(Angika Widjapahit) యను నాతని శాసనాధిపమున గౌర
వాతిశయములనంది తనకీర్తిలతను దూరదేశములఁ బ్రాకించెను.
ఈవిధముగ బాలిద్వీపవాసుల కాహిందువు. మతధర్మనీతులు,స
భ్యత మున్నగునవి యలవడఁ జేసిరి.

బాలిద్వీపమునందుఁ బ్రచారమైయున్న "పతిసహగమన
ము" ఇటుకలతో విండ్లు కట్టుట" మున్నగు పూర్వహిందూచా
రవ్యవహారములు యవద్వీపమునందు లేవు. అందువలన ప్రెడరి
క్కుదొరవారు (Frederich) హిందువులు భరతఖండమునుండి
సరిగ బాలిద్వీపమునకువచ్చియుండవలయునని యూహించుచు
న్నారు. కాని వెన్‌హాసెలుదొరవారును,, జంకిను (Jankes)
దొరవారును భరతవర్షమునుండియు, యవద్వీపమునుండియు
హిందువులు బాలిద్వీపమునకువచ్చి యుపనిష్టులై వరస్పరము
చేరిపోయిరని యోచించుచున్నారు. ఆవిధముగనే బాలికి పూ
ర్వదిశయందున్న లాంబాక్(Lombok) ద్వీపముకూడ బైనిచే

ప్రవేశించిన కెండుప్రదేశములనుండియు వచ్చినజనులచే నుపని వేశింపఁబడియుండవలయును.

బాలియందు జావాభాష యే వ్యవహరింపఁబడుచుండుట చేత బాలికి యవద్వీపసంసర్గముండియుండవలయును.

శ్యామదేశమునందలి 'పాలి' యనునది 'బాలి' యను రూపాంతరమును బొందెను. సంభవమున్నచో రూపాంతరముగ 'పాలి' యనుశబ్దమునుండి 'బాలి' యని యాద్వీపమునకుఁ బేరువచ్చియుండవలయును. పాలిభాషనుమాటాడెడి మాగధదేశీయులు మొదట వచ్చి యచ్చట స్థిరపడినపిమ్మటనే యాద్వీపమునకు 'బాలి' యను పేరు వచ్చియుండవచ్చును.

బాలిద్వీపపుప్రాచీనేతిహాసమును శోధించిచూచినచో బాలియందు స్థిరనివేశము లేర్పఱచుకొనిన హిందువు లాస్ట్రేలియాయందున్న యాదినివాసులతో సంబంధబాంధవ్యాదులు కలిగియుండిరని చెప్పుటకు కారణములు దొరకవు. బాలిద్వీపవాసుల పురాణములందు హిందువు లచ్చటికివచ్చి స్థిరపడినచాలకాలమునకుఁ బిమ్మట వారిరాజులలో నొకఁడైన 'ఇదనపి ఘనదలనుదేవ అగాంగ' యను నాతఁడాద్వీపమునందలి వివిధభాగములయందుండు వేరువేరుస్త్రీలను భార్యలుగ గ్రహించెననియు, కైలాంగ యను నొకదాసిని ప్రియమునకుఁదీసికొనెననియు, ఆదాసిగర్భమున నొకకుమారుఁడు జనిం

చెవనియు, నాతనిశిరోజములు పశు కేశముల వలెనున్నవనియు, నాతనితల్లి దాసియగుటచే. నామెకుజనించినవాఁడు రాజుకాఁజాలఁడనియుఁ, జెప్పఁబడినది. ఈవర్ణనమువలన నాస్ట్రేలియా దేశపుహీనజాతివారితో సంబంధముండెనని తోఁచవచ్చును. (Ibid.)

బాలిద్వీపోపనివేశములనుగూర్చి జాతియొక వింత సమాచారము కలదు—హిందువులు మొదట బాలికివచ్చినప్పుడచ్చట వారు రాజపుత్రులగు నిరువురు వానరులనుజూచిరనియు వారిరువురులోనొకఁడొక జాతిస్త్రీలవలె తలయున్నదనియుఁ బ్రవాదములు గలవు. ఇది మిక్కిలి నాశ్చర్యకరమైనది. ఏలయనఁగా— వాలెసు(wallace) దొరవారు జాతిపక్షి లాంబాకుద్వీపమునకు పశ్చిమభాగమునఁ గానరాదనియు లాంబాకుద్వీపమునందు నాస్ట్రేలియా ద్వీపజీవజంతువులె యధికముగఁ గనఁబడుననియు చెప్పుచున్నారు. కాని యుపుకాపక్షి బాలిద్వీపమునకుఁ జేరినపోనా, లే పెరీనాద్వీపమున గనఁబడుచున్నది. (Cyclopædia of India by Balfour)

ఈ లాంబాకద్వీపము బాలిద్వీపనివాసులచే జయింపఁబడి బాలినుండివచ్చిన హిందువులను బ్రాహ్మణులచే నచ్చట ప్రభుత్వము చేయఁబడెనని మైనోపాపండితులయభిప్రాయము. లాంబాకుద్వీపరాజునకు (అనక అగాంగ) అనఁగా స్వర్గపుత్రుఁడను.

జనులు విశేషముగ వైశ్యజాతివారని తెలియవచ్చుచున్నది
'డ్యాకా' యను పేరు 'దక్ష' (కుశల—చతుర) యనుదాని య
పభ్రంశరూపమని చెప్పిన యసంభవము కానేరదు. సాధారణ
ముగ వైశ్యులే యధిక నేర్పరులు.

జోహోరుద్వీప మట్లే సుమాత్రద్వీపమందలి యుప
దేశములతో సంబంధముకలదైయుండెను. అప్పటియుపని
శకులు సింహళమునుండియు దక్షిణహిందూస్థానమునుండియు
వచ్చినవారనియు వారితోఁగూడ భరతఖండపునాగరికత యం
దు వ్యాపించినదనియుఁ బండితులు చెప్పుచున్నారు. (Cyclop
œdia of India by Balfour.)

సుమాత్రాద్వీపమునందు నీటిబావులు త్రవ్వినపుడు వా
నిలో హిందువుల దేవతావిగ్రహములు దొరికినవని విశ్వకో
శమునందుదాహరింపఁబడినది. సిలిబీసు (Celebes) ద్వీపము
నందు హిందూప్రభావమధికముగా వ్యాపించియుండెను. ఆ
ద్వీపవాసుల ధర్మనీతిగుణములతో బాలిద్వీపపువారి ధర్మనీతు
లను బోల్చిచూచిన బాలిద్వీపవాసులు సిలిబిద్వీపమువారి వం
శస్థులైయుండవలయుననియు వారివలననే బాలిద్వీపవాసులు
హిందూధర్మదీక్షితులై యుండవలయుననియుఁ వాన్ ఏకాయ
ను నాతనియభిప్రాయము. (With the Dutch in the
East, by Captain Cool.)

మోవపాదములకు విపరీతదిశను భూమండలపశ్చిమార్ధగోళము నందలి భూప్రదేశమై యుండనోపు (Antipodes) అమెరికా ఖండము మనకు పాతాళమునందున్నదని చెప్పవలయును. పూర్వోక్తములగు డమరాకారము, మాహీయరాజ్యము వీనిరెండింటికానికచే నమెరికాయని పేరువచ్చియుండనోపు.

భారతవర్షమునకును శాస్త్రమున కుమారయను పేరుదాహరింప బడియున్నది.

ఆయస్తునవమస్తేషాం ద్వీపసాగరసంవృతః
కుమారాఖ్యపరిఖ్యాయో ద్వీపోయం దక్షిణోత్తరః.

సిద్ధాంతశిరోమణియందు భారతవర్షమునకు కుమారికా యను పేరు చెప్పఁబడినది. ఇందువలన 'కుమారికాభూశిర' యను పేరునకు మూలము చిక్కినట్లాయెను.

కాంభోజదేశమువారు పోయి తాము స్థాపించుకొనినదేశమునకు స్వదేశానుసారముగ క్యాంబోడియా యను పేరుపెట్టిరని యిదివఱకు చెప్పఁబడినది. అప్రకారముగనే భారతీయులు వెల్లి యుపనివేశములను స్థాపించుకొనిన యమెరికాకు భారతవర్షపు 'కుమార' లేక 'కుమారికా' యను నామానుసారముగ 'కుమారద్వీప' మని పేరుపెట్టినట్లు వ్యక్తమగుచున్నది.

అమెరికాఖండపు 'మెక్సికో' (Mexico) యను ప్రదేశము పేరు హిందువుల సంప్రవము ననుసరించి వచ్చినది. 'మ

క్సికో ' యనునది ' మాక్షిక ' యను శబ్దమునకు వికృతరూప
మై యుండవలయును. ' మాక్షిక ' శబ్దమునకు స్వర్ణమని యు
ర్థము. మెక్సికోదేశమునందు బంగార ముత్పన్నమగుచుండు
కారణముననే హిందువులు దానికా పేరును బెట్టిరని తోచు చు
న్నది. లేక బంగారమువ్యాపారము చేసెడు హిందువులే మా
క్షికులని పిలువఁబడుచు, దమనామమునే తాముస్థిరపరచుకొనిన
ప్రదేశమునకుఁబెట్టికొనియుండవచ్చునని చెప్పిన నసంభవము గాఁ
జాలదు ఇప్పుడా దేశీయులకు మక్షికులని యే పేరు కలదు. (శ్రద్ధాస్ప
దులగు (శ్రీనవీనచంద్రబాబు) వ్రాసిన 'ప్రాచ్యఖండపుభూగోళము'
( A note on the ancient Geography of Asia )
అను గ్రంథమునం దిందును కూర్చి వ్రాసినదాని నిచ్చట నుదా
హరించెదము.

'The word 'makshika' also means gold and the name Mexico is probably derived from the ancient tribes of goldminers, who called themselves Maxica Azteca'—P. 58.

మక్షికులకు ' అజటెక ' యనియు మఱియొక పేరు కల
దు. ' అజటెక ' యను పేరు ' అష్ట ' లేక ' అష్టకా ' యను
శబ్దమునకు సంబంధించియుండవలయును. ' అష్ట ' పద మైశ్వ
ర్యపరముగ నర్థమిచ్చును. ' అష్టాపద ' యను దానికి బంగార
మని యర్థము. అందువలన ' అష్ట ' పదముతో స్వర్ణసంబంధ

ము లేదని చెప్పఁగూడదు. అమెరికాయందు సువర్ణ మధికము
గా నుండుటచే దానిని పాలించెడు మహీరావణుఁడు దానికి
'కాంచనా' అనియు పేరు పెట్టియుండెను. ఆకారణమున మ
హీరావణు నొకచోట 'కాంచనాపతి' యనియు, వేరొక
చోట 'కుమారపతి' యనియుఁ జెప్పఁబడెను.

మహీరావణుఁడు వధింపఁబడినపిమ్మట నందు సూర్యవంశ
స్థుల యధికారమునకుఁ బ్రారంభమాయెను. శ్రీరామచంద్రుని
తనయుఁడగు కుశునివంశస్థుఁడైన వజ్రనాభుఁడు దానికి రాజై
ప్రభుత్వము నెఱపుకాలమున నాతఁడచ్చట నొకయజేయమగు
దుర్గమును నిర్మించి 'రామసేతువు' అనునుత్సవము నొకదా
ని నేర్పరచెను.

మెక్సికో అజటికులు సూర్యవంశపువారమని చెప్పకొ
నుచున్నారు. వారియున్నతసభ్యత మున్నగువానియందు వారి
పై హిందువుల ప్రభావమే యధికముగ నున్నట్లు కనఁబడు
చున్నది.

సూర్యవంశమువారు శ్యాము (Siam) దేశమునకువచ్చి
యందుపనివేశములను స్థాపించుకొని స్థిరపడినపిమ్మట వారె
దూరదూరముగఁ బోయి క్రమముగ నమెరికావఱకు వ్యాపిం
చుకొనిరని సువ్యక్తముగఁ గనఁబడుచున్నది. కేదారనాథబాబు
వ్రాసినయనుసంధానపూర్ణమైన 'Hindu Civilisation in

America" "అమెరికాయందు హిందువులసభ్యత" యను గ్రంథమున నిందును గూర్చి యుదాహరించిన పాశ్చాత్యపండితులలో నొకనియభిప్రాయము నిచ్చట నుదాహరించెదము—

M. Desid Chamey in his 'Ancient Cities of the New world' says 'that the ancient civilisation of Mexico and Cambodia and Java is of the same origin.'

మెక్సికోప్రదేశమునందుదొరకిన ప్రాచ్యదేవమూర్తుల తో యవద్వీపమూర్తిశిల్పము సంపూర్ణముగఁ బోలియున్నదని విశ్వకోశ కారులు వ్రాసియున్నారు.

అమెరికాయందు బౌద్ధులసంబంధమును ప్రధానముగ గూర్చి తెలిసికొనకోరిక కలదేని సత్యేంద్రనాధబాబు వ్రాసిన 'బౌద్ధధర్మ' మను గ్రంథమును జదువవలయును.

ఆఫ్రికాఖండమునందలి హిందువుల యుపనివేశములను గూర్చి యాలోచింపవలయును. ఆఫ్రికాఖండములోని సోమాలిదేశమునందును, అమెరికాఖండములోని మెక్సికోదేశమునందును, దొరకినహిందువుల దేవతావిగ్రహములు యవద్వీపశిల్పకార్యములని నిస్సందేహముగఁ గనవచ్చుటచే నతిప్రాచీనకాలమున నే యవద్వీపమున బ్రాహ్మణులయుపనివేశములు స్థాపింపఁబడియుండవలయునని విశ్వకోశ కారులు సిద్ధాంతము చేసిరి.

ఆఫ్రికాఖండమునకు సామీప్యమునను న్న యనేక ద్వీప

మూలపేరులు ప్రాచీనహిందువులు పెట్టిన పేరులై యున్నవి. ఇపు
డు మార్పుజెందిగాని రూపాంతరము పొందిగాని యుండవచ్చునని
పురాతత్త్వవిదులగు ననేకపండితు లంగీకరించియుండిరి.

ఉదాహరణము:— ఇప్పటిపేరు. పూర్వపుపేరు.

| ఇప్పటిపేరు | పూర్వపుపేరు |
|---|---|
| మోరిషసా | మరీచి |
| మడిగాస్కర | చంద్రద్వీపము |
| సోఫలా | సుఫల |
| సకోట్రా | సుఖతర |

ఆఫ్రికాఖండమునందు ప్రధానదేశమగు 'ఈజిప్టు' దేశ
మునొక్క ప్రస్తుతపుపేరును పూర్వపుపేరును హిందువులు
పెట్టినారని ప్రమాణములు గనఁబడుచున్నవి. ఆదేశపుపూర్వ
పుపేరు 'మిసర' యనునది సంస్కృత 'మిశ్ర' శబ్దముయొ
క్క వికృతరూపమని చెప్పవలయును. భారతవర్షమున 'మిశ్ర'
యను బిరుదమునందిన బ్రాహ్మణు లాఫ్రికాఖండోపకూ
లములం దుపనివేశికులైనందున నాదేశమునకు 'మిసర'
యను పేరువచ్చినదని యనేకపాశ్చాత్యపండితుల మతము. కా
ని మఱికొందఱుపండితులచ్చట నానాజాతీయజనులు వ్యాపా
రార్థమై చేరి సమ్మిశ్రితులగుచుండుటవలన నాపేరువచ్చినదని చె
ప్పుచున్నారు. ఈవిషయమున విశ్వకోశమునందు వ్రాసినదా
నినెత్తియిందుదాహరించుట కర్తవ్యమని తోఁచుచున్నది:—

‘మిసర’ యనుశబ్దము భారతవర్షమునందు మిగుల పురాతనకాలమునుండి వ్యవహరింపబడుచున్నది. భారతవర్షమునందు ‘మిశ్రి’ యను బిరుదముధరించిన బ్రాహ్మణులతిప్రాచీనకాలమునంబోయి యాఫ్రికాఉపతీరములందుపనివేశములను స్థాపించిరనియు, తదనుసారముగ నాప్రదేశమునకు ‘మిశ్రి’ శబ్దవైకృతమగు ‘మిసర’ యను పేరువచ్చినదనియు విలసను మున్నగుపండితులు చెప్పుచున్నారు. వేరొకకొందఱు సంస్కృతశబ్దమైన ‘మిశ్రి’ (to mix) యనుధాతువునుండి మిసరశబ్దము పుట్టినదనియు, నతిప్రాచీనకాలమునందు ఫినీకా, సిరీయా, బాబిలోనియా, కాల్డియా, మిదియా, భారతీయమున్నగు వివిధదేశముల వారు వ్యాపారార్థమై భూమధ్యసాగరమున రాకపోకలు సల్పిరనియు, మిసరదేశమునందట్టి దేశముల వారు వ్యాపారముకొఱకు వచ్చి చేరియుండుటవలన ‘మిసర’ (మిశ్రిదేశ) యను పేరువచ్చినదనియుం జెప్పెదరు. కాని యిచ్చటనొక ప్రశ్నకెడము గలుగుచున్నది. ఏమనఁగా—భూమధ్యసాగరమున నట్టివేఱువేఱుదేశముల వారు చేరియున్నప్పు డితరదేశముల వారిని విడిచి భారతీయుల భాషయైన సంస్కృతపు ‘మిశ్రి’ శబ్దమునకు ప్రాధాన్యమునిచ్చి యా దేశమునకా పేరువచ్చుటకుఁ గారణమేమి ? ఇందులకు సమాధానమును చెప్పుటచాలకష్టము. పైగా విలసను (Vilson) మున్నగుపండితుల మతమే యుండఁగా

శాఖ్యాహయి నటుటతోఁ (యుచున్నది.

ఇప్పటి "ఈజిప్టు" అను పేరుగూడ సంస్కృత "గుప్త" (సురక్షితయనునర్థమునందు) శబ్దతద్భవమని విశ్వకోశమునందుఁ జెప్పఁబడినది. ఈజిప్టు ప్రాచీనధర్మము భారతీయశైవధర్మము నబోలి యుండునని చెప్పుటలో పురాతత్వజ్ఞులకు విశేషమతభేదమున్నట్లు కనఁబడదు.

హరివంశమునందు శోణితపురిరాజైన బాణుని తనయయగు నుషను శ్రీకృష్ణుని పౌత్రుఁడైన యనిరుద్ధున కిచ్చి వివాహముఁ జేసినట్లొక యుపాఖ్యానము కలదు. అందలి శోణితపురవర్ణనమును, నప్పటి యధివాసుల యాకృతి ప్రకృతులవర్ణనమును యోచించిచూచినచో నాప్రదేశమాఫ్రికాఖండమునం దొక స్థానమై యుండవలయునని చెప్పుటకు కష్టముండదు. అదియునుగాక నావివాహోపాఖ్యానమునం దప్పటి మహావిష్ణూపాసకులు, శివోపాసకులు మున్నగువారివర్ణనమును జూచిన యెడల నార్యులప్పటివారికాలముననే తమమతప్రచారము చేసియుండిరని బోధపడును. ఆశోణితపురమనునది ఈజిప్టులోని "షోంటా" (Shoont) యను ప్రదేశమని బోధయగుచున్నది. ఈవివాహసంబంధమువలన కృష్ణుని వంశీయులగు నార్యజాతివారనార్యజాతివారితో మిశ్రితులగుటచే (మిశ్ర) శబ్దతద్భవమైన (మిసర) యను పేరేలవచ్చియుండఁగూడదు?

వయువివరణములవలన మిసరదేశమును భారతీయుల ప్రభా
నోపనివేశమని చెప్పవలసియున్నది. ప్రాచీనమిసరదేశముతోఁ
బ్రాచీనభారతదేశసాదృశ్యము విశేషముగనున్నది. పురాతత్వ
మును పలుమారుపరిశీలించిచూచినను మిసరదేశము భారతీ
యుల యుపనివేశమని యేర్పడును. మిసరదేశమందలి పురా
తత్వము, ధర్మశాస్త్రము, దేవతత్వము, రీతి, నీతి మున్న
గునవి శోధించిచూచినచో మిసరదేశపువారు లార్యజాతి
వారి వేదోక్తశాఖవారని బోధపడును. ప్రతీచ్యమనీషు లనేక
వాక్యముగ దానినే యనుమోదించుచున్నారు.

భారతవర్షమునకు దక్షిణమున నాఫ్రికాయున్నప్రదే
శములలో శ్రీకృష్ణునివంశపువారనార్యులతో వివాహసంబం
ధములవలన మిశ్రితులైనట్లు ప్రమాణములుదొరకినవిధము
ననే భరతఖండమున కుత్తరదిశయందును నమెరికాయందును
వారనార్యులతో వివాహసంబంధములు కలిపికొనినట్లు ప్రమా
ణములు దొరకఁగలవు. శ్రీకృష్ణుని తనయుఁడగు ప్రద్యుమ్నుఁ
డు వజ్రపురమందలి వజ్రనాభుఁడను రాక్షసుని తనయయగు
ప్రభావతిని పరిణయమాడెనని హరివంశమునందుఁ జెప్పఁబడి
నది. ఆవజ్రపురము సుమేరుపర్వతసామీప్యముననున్నదని చె
ప్పఁబడినది. అందువలన నావజ్రపురమునది ప్రస్తుతపుసైబేరి
యాప్రదేశముననున్నదని చెప్పవలసియున్నది. అందు వివాహ

సంబంధ మొక్కటియే కాదుగద, ప్రద్యుమ్నుఁ, సాంబకుమా రులందు వాసము చేసిరి. మహాభారతయుద్ధానంతరము వా ర చ్ఛటికిఁ బోయి నివసించిరి. ఆకారణమున నతిపురాతనకాలము నందే యాదవులుత్తరఏషియాయం దతిప్రబలముగు నుపనివే శమును స్థాపించిరని వ్యక్తమగుచున్నది. యాదవులొకానొక కాలమున మధ్యఏషియాయందును నుత్తరఏషియాయందును వి శేషప్రాముఖ్యమును స్థాపించియుండిరని యితిహాసప్రమాణ మువలనఁ దెలియవచ్చును. శ్రీకృష్ణునిపుత్రులు ఘటవాక్రమము న సింధునదీప్రాంతమును వదలి జుబిలిస్తానమునకుఁ బోయి యం దుండి సమరకందపర్యంతముగల దేశములలో వసతివాడల నేర్పరుచుకొనిరని కర్నలుటాడ్డుదొరవారు వ్రాసిరి. (Tod's Rajasthan, Vol. I, p.82.)

సైబేరియాలోను ఫిరలెండులోనున్న 'సమియెడిసలు' (Samayedes) చుడిసులు (Lchoudes) శ్యామదేశపుయాద వులును భరతఖండపుయాదవులై యుండిరి. ఆయుభయదేశీ యులభాషలు పరస్పరసాదృశ్యముఁ గలిగియుండుటచే వారు హిందూజర్మనీతరగతిలోఁ జేర్పఁబడిరని టాడ్డుదొరవారు వ్రాసిరి. (Tod's Rajasthan Vol. I. p. 529)

పైనిఁజెప్పిన రెండుజాతులవారి జన్మస్థానము మధ్య ఏషియాయని రెముసెట్టుదొరవారు నిర్దేశించియుండిరి. అక్కు డనే యమునవంశస్థులు చాలకాలము తమయాధిపత్యమును

జరిపిరి. యాదువంశస్థులనుగూర్చి వ్రాయబడిన వివరణయందు వారు భరతఖండమును క్రీ. పూ. పంచదశశతాబ్దమున విడిచిపోయి యొకస్థలమున విశ్రమించిరని చెప్పఁబడినది. వారు విశ్రమించినస్థానమునకు 'యమునిడాంగు' (యమునాశైలము) అని పేరు. బేబరావర్వోపంక్తియే యాదువంశస్థులచే నధిష్ఠింపఁబడినదని వ్రాసియున్నాఁడు.

హిందూపర్యాటకుఁడగు పురాణగిరి మునునాతఁడు మహాస్న దీయుల బసూరానగరమున "నారాయణరావు గోవిందరావు" అను రెండు విష్ణ్వాలయములనుజూచెను. అది శ్రీకృష్ణునివంశపువారి ప్రభావమునకుఁ బ్రమాణములను జూపుచుండెను.

చంద్రవంశమువారివలెనె సూర్యవంశమువారు నుత్తర ఏషియాలో నుపవేశములను విశేషముగ స్థాపించిరని మత్స్యపురాణమునందుఁజెప్పఁబడినది. అందిక్ష్వాకుసంతతివారు భరతఖండమును విడిచిపోయి యుత్తరకురుదేశమున వాసముచేసిరనిచెప్పఁబడినది. ఆప్రదేశమునకిపుడురుష్యాతార్తారి (Russian Tartary) యని పేరు. సూర్యచంద్రవంశస్థులిరువురును స్వదేశమునందలి బీదజనుల నుత్తరకురుదేశములకు నియతముగఁ బంపించుచుండిరి.

చీనాదేశమునందొకకాలమున (1400) నొకవేయిమన్నూరు హిందువులచే నుపనివేశములు స్థాపింపఁబడినవని చరి

త్రవలనఁ దెలియవచ్చుచున్నది. చీనాదేశచరిత్రయందు, కేథా (చీనాదేశము) మొదట భ్రాంతిమోపనివేశికులచే నివసింపఁబడె నని చెప్పఁబడినది.

అరబ్బీదేశమునందు మహామ్మదవతరించుటకుఁబూర్వ మొక హిందూరాజచ్చట రాజ్యముచేసెనని పురాతత్వవిదులగు నైరోపాపండితులు మనకొకక్రొత్తవార్తను జెప్పుచున్నారు. ముక్తేశ్వరుఁడను నొక సారస్వతబ్రాహ్మణుఁడు మక్కాలో రాజుగనుండెననియు నాతనితనయుఁడగు సహారి దేవపుత్త్రుఁడగు సాలయము నాతనితోఁగూడ శత్రువులచేఁ బరాజితుడై వెడలగొట్టఁబడి పుంష్క్రద్వీపమునకుఁ బోయెనని కన్నింగుహామ్ దొరగారు చెప్పిరి.

అరబ్బీదేశమునందు హిందూప్రాముఖ్యమును గూర్చి యొకప్రవాదముకలదు. అదియెట్లనఁగా—

మక్కాలో నొక శివలింగము కలదనియు, ఇస్లాము ధర్మప్రవర్తకుఁడగు మహామ్మదునకుఁబూర్వ మచ్చట నగ్ని పూజకులు ప్రాభవవంతులై యుండిరనియు నపుడు భారతవాసులగు హిందువులు వ్యాపారమునకొఱకును, తీర్థయాత్రలకు న చ్చటికిఁబోవుచువచ్చుచుండిరనియు హిందువులచ్చట ప్రాముఖ్యులై యున్నకాలమునం దొక శివలింగము ప్రతిష్ఠింపఁబడెనని యుఁ జెప్పబడుచున్నది. భవిష్యత్పురాణమునందు ముక్తేశ్వరుఁడ

గు శివమూర్తినిగూర్చి చెప్పఁబడినది. హిందూమతమునకు వి
రోధులగు మహమ్మదీయులు ప్రబలులగుట సంభవించిన
తనే హిందువులు మక్కాకుఁ బ్రయాణముసలుపుట నిలిచిపో
యినదనియు మహమ్మదీయులు ముక్తేశ్వరవిగ్రహమును దా
చివేసిరనియు నిపుడు మక్కాయందు (కాబా) యనుమందిరము
న నున్న కృష్ణశిలయే ముక్తేశ్వరుని రూపాంతరమనియుఁ బ్రబల
మైనప్రవాదము కలిగియుండెను. ఈయంశము విశ్వకోశమున
నుదాహరింపఁబడియున్నది.

పైనిజెప్పిన రాజగు ముక్తేశ్వరుఁడే శివలింగమును స్థా
పించి యందులకుఁ దనపేరగు ముక్తేశ్వరనామమును బెట్టెనని
యు బోధయగుచుండెను. ఇంతేకాక ముక్తేశ్వరుని పేరే నగర
మునకు వచ్చి యనియే వికృతరూపమునొంది ,,మక్కా'' యై
యిపుడది మహమ్మదీయులకు ముక్తిక్షేత్రముగఁ బరిణమిం
చినది—

పెలెస్తైను (Palestine) నందున్న జూడియా (Judea)
ప్రదేశమునకు జూడా (Juda) యనునది ప్రధాననగరము.
దానికి యదువంశస్థుల సంబంధముండవచ్చుననుట కసంభవ
ము కనఁబడుటలేదు.

ఏష్యామైనరునందు శివసాయను ప్రదేశమునకు శివసా
యనునది ప్రధాననగరము. అందు శివోపాసకులగు హిందువులు

నివసించియున్నట్లు తోఁచుచున్నది.

క్రీ. పూ. రెండుశతాబ్దములకుఁ బూర్వము హిందువు లార్మేనియాకుఁ బోయి యచ్చట నివసించిరని రమేశచంద్రబా బనేకప్రమాణములతో నుదాహరించెను.

మహాభారతయుద్ధమైన వెనుక చంద్రవంశస్థులు పర్షియా దేశమునకుఁ బోయి యందు ఖొరంసా యనునగరమున రాజ్య భారమును బూనియుండిరని తెలియవచ్చుచున్నది. (The Indo-Scythic races of Greecian authors.)

పరిష్యాదేశములోని యనేకప్రదేశముల పేరుల చివర ను (స్థాన) యనుదాని తద్భవరూపమగు (స్తాన) యనుపదము చేరి నాప్రదేశములందుఁగల హిందువులసంబంధమును దెలియఁ జేయుచుఁ దత్సంబంధహిందూచరిత్రను గాపాడుకొనుచు వచ్చు చున్నది ఉదాహరణము — కుహిస్తాన (Kuhistan) లరిస్తాన (Laristan) ఖుజిస్తాన (Khuzistan) ఫరసిస్తాన (Farsistan) సీస్తాన. (Seistan) ఇత్యాదులు.

సమరఖండ, కానగడ మున్నగు పేరులు హిందువులచేఁ బెట్టబడినవి. హిందువులు ఈదేశములకుఁ బోయి యందు స్థిర పడి యాదేశములను స్వదేశములుగఁ జేసికొనియుండని మొదలఁ గాని యందాధిపత్యమును జరపి యాదేశస్థులతోఁ దామైక్య మును బొందియుండని మొదలఁగాని వారాదేశములకుఁ బెట్టినా

మతములు విదేశీయులచేఁ దర్కింపకనే నిరాక్షేపముగఁ బరిగ్రహింపఁబడవు. అదియునుగాక యీనామము లింతవఱ కూర్జితముగఁ బ్రచారమగుటయును లేదు.

హిందువు లుత్తరమధ్యపశ్చిమేషియాయం దుపనివేశములను స్థాపించిరని చూపితిమి. వారైరోపాఖండమునం దుపనివేశములను స్థాపించినట్లు ప్రమాణములు దొరకును.

మహాభారతమునందు యదువంశధ్వంసవర్ణనమున శ్రీకృష్ణుని యన్నయగు బలదేవుఁడు యోగావలంబనముచే బ్రాణత్యాగముఁ జేసికొనయత్నించునపుడు శ్వేతవర్ణములైన. సహస్రమస్తకరక్తముఖములుగలసర్పము లాతనిముఖమునుండి వెలువడి సాగరాభిముఖముగఁ బోయినవనియు తక్షక, వాసుకి, మిశ్రిమున్నగువారు వానినభినందించి యెదురుకోలు గావించిరనియుఁ జెప్పఁబడినది. ఇందలి మిశ్రి యనఁగా మిశ్రదేశజనులని బోధయగుచున్నది. బలరాముని సంతతివారు సముద్రమును దాటి పోయి గ్రీకులు మున్నగునన్యులచే సర్వవిధములఁ బూజింపబడిరను నైతిహాసికసత్యము (Historical truth) యీ వర్ణనమునం దిమిడియుండవచ్చును. సర్పపూజేతిహాస సామర్థ్యమునే బలపరుచుచున్నది. (Hindu Sudericrity, p. 189.)

గ్రీసుదేశమందు బలరాముని సంతతివారు మొదట ప్రతిష్ఠితులై విశేషప్రాముఖ్యమును బొందిరనుటకు విశ్వాసా

స్తామైన ప్రమాణములు దొరకఁగలవు. గ్రీసుదేశమునందలి 'హిరక్లిడా' యనువారి ప్రత్యావర్తన (The Return of Heraclidæ) యను పౌరాణికాఖ్యానము ప్రాచుర్యము నొందియున్నది. ఆయాఖ్యానము హిందువులువచ్చి యుపనివేశమును స్థాపించినట్లు చూపునని పురాతత్వవిదులగు ప్రతీచ్యపండితులు చెప్పెదరు. 'హిరక్లిడె' (Heraclidæ) యనునది 'హారికుల' యనుదాని యపభ్రంశరూపాంతరమని విశదమగుచున్నది. 'హారిక్లిడెయనువారి ప్రత్యావర్తనము' ను సుందరమైనయాఖ్యానమును బోలిన యాఖ్యానము గ్రీకుపురాణమునవేరేదియు లేదు.

"హిరక్లిడె" యనువారు గ్రీకులకు పిం దేవుఁడగు హారికులునిసంతతివారు. "హార్క్యులిస్" అనుశబ్దస్వరూపము హిందువులంచే దొరకును. "హార్క్యులిస్" అనునది "హారికులేశ" యను దానిరూపాంతరమని కర్నలుటాడ్డుదొరవారు వ్యాఖ్యానము చేసిరి. బలరాముఁడు హారికులమున కీడై (ప్రధానుఁడై) యున్నాఁడు. ఆతఁడు నిజముగ హారికులేశుఁడే. గ్రీకేతిహాసికుఁడగు అర్రియన్ (Arrian) యను నాతఁడు వర్ణించిన హారికులేశుని కీర్తికలాపములు మనపురాణవర్ణిత హారికులేశుని కీర్తికలాపములకనురూపములయి యుండుటను జూచినచో నా రెండువర్ణనములేకరీతి నున్నవని తోఁచును. మహాభారతయుద్ధానంతరము హారికులుని యొకశాఖ గ్రీసుదేశమునకుఁ బోయి యందుపనివిష్ట

మైన సంభవమున్నట్లు కనఁబడుచున్నది. భారతీయయుద్ధము ముగి
సిన యేబదివత్సరములకుఁ బిమ్మట "హిరక్లిడా" యను వారి ప్ర
త్యావర్తనమని చెప్పినందున హారికులమును, హిరక్లిడియు
నొకటేయగును. (Tod's Rajasthan, Vol. I,p.30.) ఇతర
పాశ్చాత్యపండితులయభిప్రాయముఁ గూడఁ బైనిఁజెప్పినయంశము-
నకనుకూలముగనేయున్నది. హార్బెలో (U. D. Herbellop)
యను వాఁడు భారతీయులగు నార్యులు పరిష్యాసముద్రమునుం
డి బయలుదేరి భూమధ్యసాగరమును దాటి యైరోపాకుఁ బోయి
రను ప్రవాదమున్నట్లుదాహరించియున్నాఁడు. (Asiatic Rese-
arches 1792) గ్రీకులు, రోమనులు నాయుపనివేశకుల సంతతి
వారనికూడ చెప్పియున్నాఁడు. స్ట్రాబో (Strabo,) హెరొడొ
టసు (Hrodotus) అను వారిరువురు నందలికొన్నియంశములను
బలపరచుచుండిరి—

కార్నేలియస్ నెపస్ దొరవారు హిందువులు బాల్టికు
సముద్రమువఱకుఁ దమరాజ్యమును వ్యాపింపఁ జేసిరని చెప్పియు
న్నారు.

ఐరోపారష్యాలోనున్న ఆస్ట్రాఖాన్ (Astrakhan)
యనునగరమునందిప్పుడును హిందువు లుపనివేశమైయుండు
ట ననేకు లెఱిఁగియుండవచ్చును

పూర్వోపద్వీపములయందును భారతీయద్వీపసముదా

యుమాగను విదేశరాజ్యోపనివేశముల స్థాపన జేసిన సూర్యవం
శోద్భవుఁడగు సగరచక్రవర్తి కులదీపకుఁడును తదీయగుణసంప
న్నుఁడునగు శ్రీరామచంద్రుఁడు తనపూర్వుల ఖ్యాతి కీర్తి వీర్య
శౌర్య సాహసాదిమహద్గుణములను స్మరించి దక్షిణమున లం
కాద్వీపమున నార్యులప్రభుత్వమును స్థాపించుటకు ముందడుగు
వేయు టాతనికి కేవలము స్వాభావికమే కాని వేరు కాదు.
ఆతని కదియొక ఘనకార్యము కానేరదు. ఆతఁడు లంకయందలి
దుర్జయుఁడు ననార్యరాజునగు రావణుని సంహరించి యనార్యు
లను లోఁబరుచుకొని రావణుని సోదరుఁడగు విభీషణునకు రా
జ్యాభిషేకము నొనర్చి యనార్యులనడుమ నార్యవిక్రమగౌరవ
ములనెలకొలిపి వారివలనఁ బూజింపఁబడి ప్రపంచమునందలిసర్వ
విషయములయందు నార్యు లత్యున్నతమైన నాగరికత గలి
వారని యుదాహరణమును గనపరచియున్నాఁడు. సముద్రయా
నమునకు మొదలు మార్గదర్శకులయినవా రాత్రేయులు. విశే
షముగ వంగదేశీయులని చెప్పినను జెప్పవచ్చును. కోసలదేశ
స్థులవెనుక మాగధీయు లీకార్యమునకు మార్గదర్శకులైరి—

ప్రకృతేతిహాసకాలమునందు మగధరాజపుత్త్రుఁడగు
విజయసింహుఁడు లంకావిజయమునకై వెడలెను. ఆతఁడు గో
దావరి చెంత నేస్థలమున నోడ యెక్కెనో యాస్థలము గౌరవ
సంస్మృతిపరిచయమైన 'బందరుమహాలంక' యను పేరున పిలువఁబ

డుచు నిప్పుడు నున్నది. ఆతఁ డోడయెక్కి నస్థల మాతని యశో
స్సంపదచే నెట్లుపుణ్యభూమిగఁ బరిణమించినదో యట్లే యాతఁ
డు తీరముచేరిన స్థలము నాతనికీర్తిని ప్రకటించుచున్నది. ఆ
తఁడు తామ్రపర్ణితీరమున పడవదిగి లంకలోఁ బ్రవేశించి యా
లంకను మొట్టమొదట తామ్రపర్ణియను పేరు పెట్టెను.

లంకకు తామ్రపర్ణియని పేరువచ్చినయంశమునుగూర్చి
మహావంశమునం దొక కౌతుకచరిత్రము గలదు—విజయసింహుఁ
డు క్రీ—పూ 543 వత్సరమున లంకకు వెళ్లెను. ఆతనియనుచ
రులు సముద్రతరంగాందోళనముచేఁగలిగిన వమనములు, దుర్బ
లత మున్నగుశరీరపీడనములకు లోనై యోడదిగి నేలపైఁ జేతు
లానుకొని కూర్చుండియుండిరి. అపుడు వారిచేతులకంటుకొనిన
మన్ను తామ్రవర్ణముఁగలిగియుండెను. అందువలన 'తాంబప
న్న' అనురూపమువచ్చి యాపరిసరారణ్యమునకు 'తాంబప
న్ని' యను పేరువచ్చెను. క్రమముగా దేశమంతయు నానా
మముతోడనే ప్రసిద్ధముగాఁ బిలువఁబడుచున్నది. గుజరాతునం
దున్న గిరనరయను శైలమున దొరకిన యశోకుని శిలాశాసనము
నందును లంకకు 'తాంబపన్ని' యను పేరు వ్రాయఁబడినది.
(Turner's Mahavansa, Chapter VI, p. 50. & Ceylon, by James Emerson Tennent, K. C. S., L. L. D. I. C.)

తరువాత సింహవిక్రముఁడగు విజయసింహుఁడు లంక

ము సంపూర్ణముగజయించి యామహిందూరాజ్యమును ప్రతి ష్ఠించి తనయువరాజ విక్రమాటోపమున కతకు సుకీర్తి చిహ్నముగ నాలంకకు సింహళమని పేరుఁబెట్టెను.

విజయునివంశీయులు లంకకు మొదట కృషివిద్యను గొనిపోయి యచ్చట — సస్యములకు వలయుజలాశయములను గట్టుమార్గముల నేర్పఱచి దేశము శుభసంపదల కాలవాలము గునట్లు చేసిరి.

విజయునివంశీయుఁడగు తిస్స (తిష్య ? ) యనునాతని ప్రయత్నమున క్రీ పూ 307 వ వర్షమునందు సింహళమున బౌద్ధధర్మప్రచారము ప్రారంభింపఁబడెను. అశోకుని కొమరుఁడగు మహేంద్రుఁడు నాతనితనయుఁడు సంఘామిత్రయుఁ జేరి బౌద్ధధర్మమును వ్యాపింపఁజేసిరి. తిష్యుఁడానూతనధర్మమును ప్రోత్సహించినందులకై ధర్మగ్రంథమునందు 'దేవానాంప్రియః' అనిపేరువడసియున్నాఁడు. (Ibid)

ఈవిధముగ మాగధీయులు సింహళచరిత్రమునం దున్నతపదవి నలంకరించిరి. సింహళమునందు 'ప్రాచీ' యనఁగ ప్రాచ్యులనిపిలువఁబడుదురు. దేశమునుజయించినసంబంధము చేతను, దేశమునందు ధర్మప్రచారముఁ జేసినసంబంధము చేతను, సింహళమున మాగధీయుల కట్టిప్రాముఖ్యము కలిగెను. (Ibid)

విజయసింహుని వంశమువారే యిప్పటివఱకు సింహళ

మూన నెడతెగని ప్రభుత్వమును జేసిరని సింహాళచారిత్రము వలనఁ దెలియవచ్చుచున్నది. క్రీ. శ. పండ్రెండవశతాబ్దమున నావంశములోని రాజేయగు ప్రథమప్రక్రమబాహువనుగుల పరాక్రమశాలియై దక్షిణహిందూస్థానరాజులనుజయించి క్యాంబోడియావఱకు తనవిజయపతాకములను నిలిపెను. సింహాళమును పాలించిన కడపటి రాజగు విక్రమబాహువు కడుదుష్టుఁడై దానవరూపమును దాల్చి ప్రజలను బీడింపఁ దొడఁగినందున క్రీ. శ. 1815 వ వత్సరమున బ్రిటిషువారాతనిని రాజ్యచ్యుతుని జేసి భరతఖండమునకుఁ దోలివేసిరి. (Cyclopædia of India, by Balfour.

సింహాళ ప్రతిష్ఠాపకుఁడగు విజయుసింహబాహుఁడు భారతమాత గర్భమున జనించి యామె చే పాలితుఁడైనవాఁడే. ఆతనివంశము నారిరువదియాఱు శతాబ్దములకంటె నధిక కాలమువఱకు విదేశమున రాజరాజేశ్వరులై గౌరవమునొంది తుదకు నచ్చి యాభారతమాతాశ్రయమునే పొందిరి. కుపుత్రులైనను, కుమాతలు కాఁగూడదన్న నామెతచొప్పున భారతమాత వాత్సల్యమునకు లోనై వెడలఁగొట్టఁబడివచ్చిన తనసంతానమునకుశరణ్యమాయెను.

సింహాళవృత్తాంతమును ముగించుటకుఁబూర్వము హిందువులు నౌకాయాత్రవిద్యయందెట్లు బుద్ధికుశలతగలవారో

యను సంశయమును కూర్చి యొకటి రెండుమాటలను చెప్పి యీ
గ్రంథమును బూర్తి చేసెదను నావికాయాత్రావిద్యాబలము
వలననే భూమండలమునందెల్లచోట్ల రాజ్యముల నుపనివేశము
లను స్థాపించి యచ్చట తమతమధర్మములను ప్రచారము నొం
దించి సింహళమును జయించి యందు దెస తెగకుండ రెండువేల
వత్సరములవఱకే కాధిపత్యముగా పరిపాలనము జేసిన హిం
దువు లిపు డావిద్యయం దుదాసీనులై యుండిరని తోచదు. అ
ట్టి విద్యనభివృద్ధినొందించుటకే సర్వవిధముల ప్రయత్నించుట
వారికి స్వభావసిద్ధమై యుండవలయును. అతిప్రాచీనకాలము
నుండే సింహళద్వీపము పోతాశ్రయమున (to harbour Ships)
నొక ప్రదేశముగ (Station) బరిణమించినది. వంగదేశోప
కూలమునుండి బయలువెడలి సింహళముమీదుగ చీనాదేశ
ములోని 'యాంగసికియాంగు' అను నదీముఖపర్యంతము సముద్ర
యానము పోయివచ్చుచుండెను (Ideals of the East by
Okakura) క్రీ. పూ. ఏడవశతాబ్దమునందు చీనాదేశమున
నిప్పుడు 'క్రియవో' అని పిలువబడుచున్న యుపసాగరమునందు
హిందువులు 'లోంగ్యా' యను పేరుగల యొకవాణిజ్యోప
నివేశమును (trade Settlement) స్థాపించిరి. 'లోంగ్యా'
అనునది లంకాయను పేరననుసరించి వచ్చియుండవలయును.
ఆయుపనివేశము తుదకు కాంబోడియాయందుపనివేశకులై యు

న్న హిందువులచే జయింపబడి యీ రాజ్యమున గలిసిపో యెను. (Professor De. Leccon peric) పండితుండగు డి లె కన్ పెరియను నాతండా యుపనివేశము కూర్చి యేడు, ఆదిచీనా వారిసభ్యతను పాశ్చాత్యులు మూలకారణంబు " అను గ్రంథ మునందు విపులముగా వ్రాసియున్నాడు. డాన్ (Daun) అను నొకపత్రికయందా గ్రంథమును కొన్ని విశేషముగా విమర్శన ము చేయబడినది. అందలి స్వల్పభాగము నిందుదాహరించెదను.

The sea traders of the Indian Oceon formed around the present Gulf of Kiaotchou, where the Germans have at present established a naval base., about 680 B. C. a colony, which they called Lang-ga or Langya after the old Ceylonese Lank and hgving their mart and mint at a place called Tsi-mich or Tsi-moh to the north of the Gulf * * . Their final absorption in the kingdom of Cambodia founded by Hindus— in the Indo-Chinese peninsula about the commencement of the Christian Era,

పూర్వము చెప్పిన సుప్రసిద్ధ చీనా దేశ యాత్రికుండగు ఫాహియాను 414 వ సంవత్సరమున సింహళమునుండి చీనాదేశ మునకు బోవలసివచ్చినపుడు సముద్రమార్గమునపై ప్రయాణ ము చేసెను. అప్పటిలో ప్రయాణికులు పోవుటకుగా [illegible]

పారసంబంధములగు సామానులు కూడఁ గొనిపోఁబడుచుండెను.

సింహళోపనివేశికులైన హిందువులు నావికాసై న్యమును పూర్వసముద్ధులైయుండిరని తెలియవచ్చుచున్నది. క్రీశ 495 వ వత్సరమున రాజయిన మొగ్గల్లనుఁడు జాతీయ నావికాసైన్యమును (National Marine) స్థాపించెను. క్రీ. శ 607 వ వత్సరమున సింహళదేశపురాజు చీనానుండి రాయబారులు వచ్చుచుండెను పడవలనెదుర్కొనుటకుఁ ద్యుమొటో యను బ్రాహ్మణుని ముప్పదిపడవలతోఁ బంపెనని చీనాచరిత్రమునందు చెప్పఁబడినది. పంద్రెండవశతాబ్దమునందు ప్రథమ ప్రక్రమసింహుఁడు విదేశవిజయమునకై యాత్రారంభుడైనపుడందులకై యైదు మాసములలో నందలకొలఁదిపడవలు సజ్జితముగ సమకూర్పఁబడినవి. (Epitome App. p. 73) Ceylon, by Sir James Emerson Tannent, K. C. L., L. L. D, etc.

పూర్వకాలపు హిందువులు దేశాంతరములందుపనివేశములను స్థాపించుటలో సమర్థులై బుద్ధియుందును కౌశలమునందును నిపుణులను కొఱఁతవడియుండరని పైవృత్తాంతమువలన వ్యక్తముకావచ్చును

హిందువులు భూమండలమందలి నాలుగుమహాఖండములకు రాకపోకలు సల్పుటయేగాక వారి యుపనివేశముల

ముండి సమస్తభూమండలమునకును వ్యాపించి తమ వాణిజ్యమును,
రాజ్యధర్మము, నీతి మున్నగు నాగరిక విద్యలను వ్యాపింపఁ
జేసిరని పై నివివరింపఁబడిన సూక్ష్మచారిత్రమునను తెలిసికొనవ
చ్చును. అంద ఱీవిషయమున ప్రాచీనహిందువులకు కృతజ్ఞులై
యుండవలయును. (Ideals of the East, by Okakura.)



# అనుబంధములు

| | చందాదారులకు. | ఇతరులకు |
|---|---|---|
| | అ. పై. | అ. పై. |
| 1. రాధారాణి. | 4—0 | 4—0 |
| 2. యుగళాంగుళీయకము. | 3—0 | 3—0 |
| 3. రాజభక్తి. | 2—0 | 3—0 |
| 4. శీల. | 3—0 | 4—0 |
| 5. సాధన. | 5—0 | 7—0 |
| 6. ఇందిర. | 3—0 | 4—0 |
| 7. హారావళి. | 3—0 | 4—0 |
| 8. ప్రభావతి. | 2—0 | 3—0 |
| 9. మాలతి. | 1—6 | 2—0 |
| 10. కమలాకాంతుడు. | 1—6 | 2—0 |
| 11. పరిమళ. | 6—0 | 8—0 |
| 12. రజని. | 6—0 | 8—0 |
| 13. నీరద. | 5—0 | 7—0 |
| 14. సీతావనవాసము. | 5—0 | 7—0 |
| 15. ఉన్మాదిని. | 3—0 | 4—0 |
| 16. సంతాపకుడు. | 4—0 | 5—0 |
| 17. వియోగిని. | 3—0 | 4—0 |
| 18. చంద్రసేనుడు. | 4—0 | 5—0 |
| 19. కృష్ణకాంతునిమరణశాసనము. | 6—0 | 8—0 |
| 20. ఆరణ్యక. | 6—0 | 8—0 |
| 21. వ్యాఘ్రాచార్యబృహల్లాంగూలము. | 2—0 | 2—6 |
| 22. ఉన్మత్త. | 2—0 | 2—6 |
| 23. మీరాబాయి. | 1—0 | 1—0 |
| 24. రాణీతారాబాయి.. | 1—0 | 1—0 |
| 25. కాబూలుసాహేబు | 1—0 | 1—0 |
| 26 భారతమహిళ. | 5—0 | 7—0 |

ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము,

నిడదవోలు, కృష్ణాజిల్లా.

అయ్యతో చెప్పు. “నే నంతయు సరిజేసినాను. గాడిదె కొడుకు దావా తెచ్చుకోస్సి ”....

మహే—ఎవరు ? యజ్ఞేశ్వరుడు గారా ?

కేదా—“గార ”యినాడేమి ? తొత్తుకొడుకు, పాజి-లుచ్ఛ నాలిముచ్చు-

మహేం—ఇంక దావా చెయ్యడు.

కేదా—జంకినాడూ ! నేను జాక్సనుగారి నడిగినాను. అందుకే అడలు— భ్రష్టుడు—దావా చేయునట— పత్రము నకు సాక్ష్యము రాదు. అందుకే పంద జంకినాడు.

మహేం—అది కాదు.... అతనికి మా అక్క నిచ్చి పెండ్లి చేయుదుము.

కేదా—పెళ్లి ! ఏమంటివి ! సరిగా చెప్పు. పెళ్లే ! విధిపూర్వక వివాహమే ?

మహేం—నేడు ప్రధానము. తాంబూలాలు పుచ్చు కొనుటకు వారు వచ్చెదరు.

కేదా—ప్రధానమే ! తాంబూలములు పుచ్చుకొం దురా ? పిల్లను చూచుట— పిల్లవానిని చూచివచ్చుట— ఇచ్చుట— పుచ్చుకొనుట—కట్నము, కానుకలు, అన్నియు తెగి నవా ? చూడ వచ్చెదరా ? ఎప్పుడు ?

మహేం— నేడే !

కేదా—సరే.... ఈపెళ్లి కాదు. నేదుండి నేను రేపు పోయెదను. ఇచ్చటనే భోజనము చేసెదనని మీ అమ్మతో

చెప్పుము. నా కొరకేమియు ప్రయత్నము చేయవద్దు. సుశీల ఏదీ?

మహేం—కనబడ లేదు.

కేదా—దాని కీపెళ్లి యిష్టముకాదు గదా?

మహే—అదేమో?

కేదా—దాని కిష్టమైన నేమి?

(సుశీల వచ్చును)

అమ్మా, నీకు పెండ్లి యట? (ఆమె ఊరకుండును) సరే. ఈ పెళ్ళి కాజాలదు. నేను కానీయను. నీకిది యిష్టము లేదు కదా? (ఆమె ఊరకుండును) తెలిసినది. మహేంద్రా! ఈ పెళ్లి కాదు. సుశీలా, మీ నాన్నతో 'నాకు కూటికి గుడ్డకూ మీ రీయలేనిచో కేదారుడు నన్ను పోషించున' నుము. నా కాడపిల్లలు లేరు. నీవే నా కూతురవు. మా యింటికి రా! (సుశీల ఏడ్చును) ఏడువకు. ఈ పెళ్లికానీయను; నేను కానీయను. మహేంద్రా! కాగితము కలమును తీసుకొనిరా! (పోవును. నవ్వి) దేవేంద్రా! బోధపడినది. అంతయు తెలిసినది. నీ యవస్థను నాకిచ్చి నా యవస్థను నీవు కొనుము....ఇట్టియెడ నేమి చేయవలయునో మన సంఘమునకు చక్కగా బోధింతును. దిక్కుమాలిన మన సమాజము కసాయి దుకాణము. పిశాచి! రాక్షసి! (సుశీలతో) అమ్మా! క్షమించు. నీయెదుట తిట్టకూడదు. మన సంఘము చాలా

మంచిది, పరమసాధువు. సనాతనార్యఋషిసంఘటితము. అది పాడువడునా ? అట్లనగూడదు.

(కాగితము కలముతో మహేంద్రుడు వచ్చును).
మహేంద్రా, తెచ్చినావా ? ఇటు తెమ్ము.... కాదు. నీవే వ్రాయుము.

మహే—ఏమి వ్రాయను ?

కేదా—'ఈ పెండ్లి కాబోదు' అని వ్రాయుము. పిమ్మట నందరకిని చూపవలయును....నవ్వెదవేమి ? వ్రాయి ! (అతడు వ్రాయును). ఏదీ చూపుము. (చదివి) ఏదీ కలము. ఇదిగో నా సంతకము. 'శ్రీ కేదారనాథ భట్టాచార్యులు' చూడు. దీనిని జాగ్రత్తగా నుంచుము. అందరికి చూపవలయు. సంతకమయినది. ఇక భయము లేదు. అమ్మా, భీతిల్లకు. రమ్ము లోనికి పోవుదము (వెళ్లుదురు).

మహే—అసాధ్యుడు లాగున్నాడు. (వెళ్లును).

---

## ఐదవ రంగము.

(దేవేంద్రుడు, ఉపేంద్రుడు, యజ్ఞేశ్వరుడు, సదానందుడు, ఉపేంద్రుని భక్తగణము)

ఉపే—దేవేంద్రా, జాగేల ? ముహూర్తము సన్న మైనది, ప్రధానము కానిమ్ము, "శుభస్య శీఘ్రమ్".

